అపూపదాన సంకల్పం

మమత్రయస్త్రింశత్ దేవతాత్మక విష్ణురూపీ సహస్రాంశు శ్రీపురుషోత్తమ ప్రీతిద్వారా నిఖిలపాపప్రశమ పూర్వం

పుత్రపౌత్రయుత ధనధానక్షేమసమృద్ధి లోకద్వయ సుఖహేతు పృధ్వీదాన ఫలాప్రాప్త్యపూప

ఛిద్రసమసంఖ్యవర్షసహస్రవధీ స్వర్లోకనివాసాది కల్పోక్త ఫల సిద్ధ్యర్థం మలమాస ప్రయుక్తం అపూపదానం

కరిష్యే.

పైవిధంగా సంకల్పం చేసి  అపూపములను లేదా దానం ఇచ్చే ఇతరవస్తువులను పూజించి, తరువాత

బ్రాహ్మణ పూజ కూడా చేసి క్రింది శ్లోకాలతో బ్రాహ్మణుని ప్రార్థన చేయాలి.

శ్లో॥విష్ణురూపీ సహస్రాంశు సర్వపాపప్రనాశనః। అపూపాన్న ప్రదానేన మమపాపం వ్యపోహతు॥

నారాయణ జగద్వీజ భాస్కర ప్రతిరూపక। వ్రతేనానేన పుత్రాశ్చ సంపదంచాపి వర్ధయ॥

- యస్యహస్తే గదాచక్రే గరుడోయస్యవాహనం।శంఖఃకరతలే యస్య స మే విష్ణుప్రసీదతు॥

కలాకాష్ఠాదిరూపేణ నిమేషఘటికాదినా। యో వంచయతి భూతాని తస్మై కాలాత్మనే నమః॥

కురుక్షేత్రమయం దేశః కాలః పర్వద్విజో హరిః। పృథ్వీసమమిమం దానం గృహాణ పురుషోత్తమ॥

మలానాంచ విశుధ్యర్థం తవదాస్యామి భాస్కర।ఇదం సోపస్కరం త్రయస్త్రింశదపూపదానం సదక్షిణాకం

సతాంబూలం    సంప్రదదే, ప్రతిగృహ్యతాం॥ అని చెప్పి అపూపములు ఉంచిన పాత్ర, దీపము,

వస్త్రములు    లేదా సంకల్పించిన ఇతర వస్తువులను బ్రాహ్మణుని చేతికి ఇవ్వాలి

(ప్రతిగృష్ణామి-అని దానం స్వీకరించే వ్యకి చెప్పాలి)

ఇతి అపూపదాన విధి